శ్రీరస్తు.

5 6 5

పిల్లలకొఱకు

# విఘ్నేశ్వర పద్యములు.

వీటిని

ముద్రాయతనాధిపుండగు

దశమంతరావు రామమూర్తి

రచించెను.

---

మొదటికూర్పు 500 ప్రతులు.

---

అనకాపల్లి

శ్రీ వేంకటరమణవిలాస ముద్రాక్షరశాల

ముద్రితము.

1911

వెల రు 0-0-6

## పీఠిక.

ఇందలి కథయును, పద్యములును సాధ్యమగునంత వఱకు, చిన్నతరగతి బాలురకును, బాలికలకును గ్రాహ్యమగునట్లు లిఖింపఁబడినది. గనుక నచ్చటచ్చట కొన్ని సంధులు మొదలగునవి విడమర్చి, వ్రాయఁ బ్రయత్నించెను. ఈదిగువ పద్యము చాటువుగా నుదహరింపఁబడినది.

అనకాపల్లి.
17-8-1911

ఓ. రామమూర్తి.

(వినాయక చతుర్థీచంద్రదర్శనము)

ఉ॥ "పూర్ణతయించు కేశియును బూజ్యత లేశముఁ
లేకయుండినన్।
నిర్ణయచిత్తులై జనులు నిగ్గనిందలు సేయుచుం
డినన్। (మ. వి.)
వర్ణఘనంబుమాని కవి వర్గము దూషణఁ జేయు
చుండినన్।
కర్ణయుగంబులన్వినుచుఁ గౌరవమే నిలువన్
సితాచరా"। (మ. వి.)



## విఘ్నేశ్వరునికథ.

---

బాలులారా !

ఒకరోజున పార్వతీదేవి యభ్యంగనస్నానముఁ జేయునపుడు క్రిందఁబడిన నలుఁగుతాలికలన్నియు కూడదీసి వాటిని యొకబొమ్మవలె జేసెను. ఆబొమ్మ మిక్కిలి చక్కఁగా నగుపడుటచేత పార్వతీదేవి బ్రహ్మను పిలిపించి, దానికిప్రాణముపోయించెను. ఇట్లైన తరువాత యాపిల్లవానిని తన కుమారునిగాఁ భావించి, యామె వానిచేతికి నొక చిన్న శూలమునిచ్చి, యితరులను లోనికి రానీయవద్దని చెప్పి, తాను స్నానము చేయుటకు వెళ్లెను. ఇంతట, యీశ్వరుఁడు తపస్సు చాలించి కైలాసపర్వతమునుండి యింటికి వచ్చెను. గానిశూలముఁధరించిన యాబాలుఁడు, యీ

శ్వరుని యడ్డగించి, లోనికిరానీయకుండెను. ఈశ్వరుడు బలత్కారముగా లోనికి వెళ్లబోవుచుండ, యాబాలుడతనిని శూలముతో పొడిచి యాటంకపరిచెను. ఇంతట యీశ్వరునకు కోపమువచ్చి, యాబాలుని, తనశూలముచేత సంహారించి, లోనికి ప్రవేశించెను. తరువాత పార్వతీదేవి స్నానము చాలించి, ద్వారముచెంత పిల్లవానినిగానక, తన భర్తయగు యీశ్వరునివలన, జరిగిన ప్రమాదముం దెలుసుకొని, మిక్కలి విచారించి, యంత స్వల్పాయుర్దాయమునిచ్చినందుకు బ్రహ్మపైమండిపడుచు, కోపాగ్ని రాల్చుచుండెను. ఆమెయొక్క యాగ్రహమునకు, లోకములన్నియు తల్లడిల్లి మూడుకోట్లదేవగణంబులును చేరి, బాలునిమరల బ్రతికించుటకు, నుత్తరముఖముగాపరుండియున్న యెవరిశిరస్సైనను ఖండించి తీసుకొనిరమ్మని భటులకు, యాజ్ఞాపించిరి. గానియుత్తరముఖముగా నొక యేనుగుమాత్రము పడుకొని యుండెను. గనుక దానిశిరస్సును తీసుకొనివచ్చియా

బాలుని మొండెమునకు నతకగా, యతడు తిరిగి సజీవుడయ్యెను. అందరును మిక్కిలి యానందించియా బాలునకు గొప్పగొప్ప వరములనిచ్చిరి. నాలుగు చేతులును, రెండుకాళ్లును యేనుగుముఖమునుగల యాబాలునకు విఘ్నేశ్వరుడని పేరుబెట్టిరి. విఘ్నేశ్వరునిభక్తుడయిన భృంగియనువాడు వాహనముగానొకయెలుకను తీసుకొనివచ్చి యతనికి బహు మతిఁజేసెను. గనుకవిఘ్నేశ్వరునకు, యెలుకవాహనుడనిపేరువచ్చెను. ఏనుగుతలఁతీసుకొనివచ్చినప్పుడది ప్రక్కవాటుగా, తెగియుండుటచేత, దానియందు నొక్క టేదంతము, యుండెను. గనుక యితనికియేకదంతుడని పేరువచ్చెను.

భాద్రపదశుద్ధ చతుర్థిరోజున విఘ్నేశ్వరుడు, యనేకజనులచేతఁబూజింపబడి వారిచ్చినయుండ్రాళ్లు మొదలగునవి పూర్తిగాభుజించి మిగిలినవి చేతులతోబట్టుకొని బొజ్జయొక్కభారముచేత, తప్పటడుగులు వైచుకొని తల్లిదగ్గరకు వడివడిగా నింటికిఁబోవుచుండెను. ఈచర్యనంతయు దోషబుద్ధిగల చంద్రుడు

డు చూచి దృష్టివేయఁగా కడుపు బ్రద్దలయి విఘ్నేశ్వరుఁడు నేలఁ మూర్ఛిల్లెను. ఈసంగతి పార్వతికిఁ దెలసి ద్రోహియగు చంద్రుని యీరోజునఁ జూచినవారికిఁ దప్పక నిందలు కల్గునని శాపమిచ్చి, తన కుమారుఁడగు విఘ్నేశ్వరుని యుదరమును పాములతో కలియగట్టి యాబాలుని లేపి యింటికిఁ దీసుకొనిజనియెను.

పార్వతీదేవి శాపప్రకారము వినాయక చతుర్థి రోజున, శ్రీకృష్ణునికి, పాలయందు చంద్ర బింబము, యగుపడగా గొప్ప యపనింద సంభవించెను. “తనతమ్ముడగు ప్రసేనజిత్తుని జంపి శమంతకమణిని శ్రీకృష్ణుడు దొంగిలించెనని” సత్రాజిత్తుడు నిందవేయఁగా కృష్ణుడీయపవాదఁసహింపక నిజము తెలియుటకై యడవికి బయలుదేరెను. ఆయరణ్యమందు కొంతదూరమున మరణమునొందిన ప్రసేనజిత్తుని శరీరమును, మఱికొంతదూరమున యొక సింహపు కళేబరమును, ఆవెనుక; నొకజాంబవంతుని యడుగుజాడలును, వానికియగుపడినవి. వాటిననుసరించి; శ్రీకృష్ణుఁడు జాంబవంతుని గుహాయందు ప్రవేశించి,

శమంతకమణినికనుఁగొని, జాంబవంతునితో పోరాడి మణినిదీసుకొని సత్రాజిత్తునకుజూపి, తననిందబాపుకొని మిక్కిలి శ్లాఘనతఁబొందెను.

అనకాపల్లి.
10-8-1911

దః రామమూర్తి.

---

—పిల్లలకొఱకు విఘ్నేశ్వరపద్యములు.—

కావు కావు కావు కరిముఖవేగమే
దేవ దేవ దేవ దీనరక్ష
పెద్దబొజ్జనీవు పెరిగించుకొనిమాతో
పలుకకుండుటేల పంతమేల.

చాలనేడుమంచి చలిమిడిఁవడపప్పుఁ
పిండివంటలెన్నొ పెడుదుఁనీకు

బీయే యల్ టివరకు విద్యవచ్చెడులాగు
బ్రోచుచుండవలయుఁ బుద్ధినొసగి.

“ పాత్రివానికుండు పుట్టెడుబుద్ధులు”
అనినరీతిఁనీకు నమరియుండుఁ
పుడమిలేదునిన్ను బోలినదైవంబు
విఘ్నరాయ లోక వినుతనీయ.

వసుధనెపుడుఁబ్రోచు పార్వతీపరమేశు
లనగఁనీదుజనని జనకులరయ
జగతిఁనీదుపుణ్య చరితమేమనవచ్చుఁ
విఘ్నరాయ లోక వినుతనీయ.

నీదుమాతకెంత నీయందుప్రేమంబు
కలదుదేవకోటి గణమునెల్లఁ
బరగఁవరములీయఁ బనిచిరప్పించెగా
విఘ్నరాయలోక వినుతనీయ.

ఇంతమతమువైచి యెలుకపైఁగూర్చుండి

యేనుగంతతొండ మూనువాఁడ
పూవులెన్నొ దెచ్చి పూజజేసెదఁనిన్ను
విఘ్నరాయలోక వినుతనీయ.

ఉక్కవేయఁనీకు నెక్కువశ్రమలేదు
చేటలంతలేసి చెవులుకలవు
వివనకఱ్ఱయేల విసరుకొనగఁనీకు
విఘ్నరాయలోక వినుతనీయ.

వల్లేరుకాయఁని పలికెదరనిబోలు
కరిభంగినొప్పెడు కాళ్లుగావు!
ఉండ్రంబులందఁనీ తొండేలవనిబోలు
నాల్గుచేతులతోడ వలరినావు!
ఉదరోద్భవుండని యూహింతురనిబోలు
వలుగుకాలికలచేఁ వెలసినావు!
పూర్ణాయువీరీతిఁ పొలుపొందబోలునీ
జనకునిచేఁనాడు సమసినావు!

నీదుచర్యలుచూడఁగఁనింపుమీఱె

నిచటఁ నవరాత్రమెల్లఁ మా యింటనుండి
శుభములొసగుము శ్రీరమ్య శూలితనయ
మరలనంపెదఁ నిన్ను నీ మాతకడకు.

"గొంతుకెగదాయమంత్రాళ్లు కొనరితినుచు
నాశతీరక కాబోలు నారకొన్న
బొజ్జ దుఃకొని వేవేగఁ బోవుచుండె"
నాడు శశి దోషదృష్టిఁ గిన శపించి
శాపమీరోజు సద్భక్తజనులెవరైన
నేడు శశి నెవ్వరును జూడఁ గూడదనుచు.

మా దుర్గృహమున నీవేళఁ మంచివిందు
భోజనము దొరకఁ విఘ్నేశ మొదట నీకు
గొప్ప బూరెలు బొబ్బట్లు నప్పడములు
పాలు తేనియ పరమాన్న పానకములు
వేడి వేసినఁ నీకు నైవేద్యమొసగి
పిదపఁ నే రగించెద ప్రీతితోడ.

కర్పూరభోగాలు కమ్మగాఁ జేయింతు

కరుణతో మమ్మింత కావవయ్యా
కల్లేకుగాయలు కొల్లలై జేయింతుఁ
దయతోడ మమ్మింత దలపవయ్యా
గొప్పగా నుండ్రాళ్లు కుప్పలుగురిపింతుఁ
పూర్తిగాఁ దయఁబూని బ్రోవవయ్యా
చంద్రకాంతులుచాల శ్రద్ధగాఁ జేయింతు
కనులపండువుసేయగాంచవయ్యా

పనసనారింజ రసదాళి ఫలములొసఁగి
మొగలి చంగల్వపూలతో పూజసేతు
వలసియుండినచో వెలగ పండ్లుదెత్తు
గానఁబ్రోవుము విఘ్నేశ గణపతీశ.

చెలగిపాలయందు శ్రీకృష్ణుఁడొకనాడు
చందమామఁజూచె సిందవచ్చె
నీదుతల్లి కావ్య నిజము నే మనవచ్చు
విఘ్నరాయలోక వినుతనీయ.

మణినిదొంగిలించె మాయకాఁడితఁడని
జనులు ఘోషసేయ సాగిరంతో

అపుడుగృష్ణుఁడిట్టి యపవాదుఁ బాపఁగ
బయలువెడలె నిజముఁ బయలుపరుప.

అంధకారబంధు రావృతమైనట్టి
ఘోరయడవిఁ జొరగఁ గొంతి యలసి
జాంబవంతుఁ గెలిచి సాధించె మణి నప్డు
ఘనుల కింతకంటెఁ గష్టమెద్ది ?

తనదు తమ్ముఁ జంపి తదయకమణిఁ గూడ
దొంగిలించె నితఁడు ద్రోహి మిగుల
యనుచుఁ బలికెఁ గాదె! యల్ల సత్రాజిత్తు
దారయనుచు కృష్ణుఁడిఁ దోఁటుల.

“ఇట్టి లేని నింద నిటఁదు నాపైఁ గ్రైచెఁ
గా నదీప్రశద్ధ గానఁపిన్న
వారికెల్ల శుభము వర్ధిలుచుండుచు
నిందలెవ్వి రావు నిశ్చయముగ.”

సమాప్తము. శ్రీశ్రీశ్రీ

## పూర్వకవి విరచితములు.

---

శ్రీశంభుతనయునకుఁ సిద్ధగణనాథునకు
వాసిగలదేవతా వందితునకు
నాపరసవిద్యలకు నాదిగురువైనట్టి
భూసురోత్తమలోక పూజ్యతునకు ॥జయ॥

నేరేడుమారేడు నెరజమ్మిమామిడి
దూర్వాలుచెంగల్వ లుత్తరేణి
వేరువేరుగ దెచ్చి వేడ్కతో బూజించి
ఖర్వుడగు దేవునకు పలికెనపుడు ॥జయ॥

పానకంవడపప్పు పనసపండు ఖండెల్లు
దానిమ్మ ఖర్జూర దబ్బపండ్లు
తేనెయరటిపండ్లు టెంకాయ రాకొబ్బరి
చాలగా సర్పింతు సాంబజనక ॥జయ॥

గణనాథుడనుచుని ఖ్యాతినామము దాల్చి
జననియిచ్చినశూల ముసుధరించి

